# కోనేరు

—♦—

కొండకోఁటయే ——— వికసితోత్పల ——— శీర్షక.

౧౪.

కవి

కవికొండల వేంకటరావు, బి. ఏ., బి. ఎల్.,

* *

*

అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితము.

మొదటి కూర్పు.

1930.

వెల రు 0—4—0.

సర్వస్వామ్యములు కవివి.

—♦—

సీతారామా ముద్రాక్షరశాల, ముద్రితము.

నరసాపురము.

# ఇదొక చిన్న ప్రహసనము.



| రచన. | స్ఫురణ. |
|---|---|
| 10—11—1923. | నరసాపురము. |

## ఇందువచ్చు పాత్రలు.



| | |
|---|---|
| పుల్లమ్మ<br>సావిత్రి<br>భావమ్మ<br>వెంకమ్మ<br>రామమ్మ<br>రుక్మిణమ్మ<br>వరహా.<br>సత్యవతి. | కులకాంతలు. |

— కోనేరు కాపలా కాసేవాఁడు — గోపకుడు. —

## ఇందలి దృశ్యములు.



౧. పల్లెటూరి వీధి.

౨. కోనేటిగట్టు.

౩. నీరాటరేవు.

౪, దూరంగా రావిచెట్టు, గౌరిదేవి రాతివిగ్రహము, దగ్గఱగా తుమ్మిపూలుపూచిన చిన్న మొలకలు.

౫. గౌరిదేవి.

# కోనేరు



విఘ్నేశ్వరుని కృప విఘ్నంబులేక
యల సరస్వతి దయ నందంబు సెసఁగ
యమ్మలా రక్కలారా జెద మిపుడు
హాస్యంబు నీతియు నలవడఁ జేయు
నచ్చపుఁ గత, సూను డాదరబుద్ధి.

దృశ్యము ౧ పల్లెటూరు వీధి.



పుల్లమ్మ:— లోకమంతకూ పొద్దున్నే లెల్లారితే నాకు జాం పొద్దెక్కినా కాకులు కావవవు. అదేంఖర్మమో మా సాటివారంతా చెరువుకు మంచినీళ్ళకెడుతూవుంటే నాకింకా గుమ్మంలో ముగ్గెట్టుకోవడమన్నా కాలేదు [అని వాకిట ముగ్గుపెట్టుకొనుచుండును.]

సావిత్రి:—[చెరువునకు నీళ్ళకై బోవుచు, పుల్లమ్మను జూచి] ఏంవమ్మో! పుల్లమ్మత్తా! ఇంకా ముగ్గులెడుతూ

నే యున్నావు?

పుల్లమ్మ:—[అట్టె ముగ్గుచెయ్యి దులుపుకొనుచు వెనుకకుం జూచి] సమయానికొచ్చావు. కోడలా! ఉండు. ఉండు. నేనూ చెఱువు కొస్తున్నా. [లోనికిం బోవు]

సావిత్రి:—రా! ఇక్కడే నుంటాను. [అని యాగును.]

పుల్లమ్మ:—[లోపలనుండి యొకబిందెతో గబగబ యీవలకు వచ్చుచు పిల్ల కాలికడ్డుపడుట నభినయించి] ఓసి! రాలుగాయిముండా! నావెనకాలే మిణక్కుపోతేయింట్లో అణిగ్గుండలేవు? ఎక్కడకు వెళ్లినా వెన్నమ్మలాగు వెంటాడిస్తావు. [అని కొట్టనుద్దేశించి కొడుకును నిగూపించి] ఒరేవు! రామిగా! రాలిపోయావురా! ఎక్కడ చచ్చావు. అంతా నేను చెఱువుకు వెళ్లేటప్పుడే హాశంవాయుతారు. [అని యత్తగారినుద్దేశించి] కాస్సేపు మనమరాల్ని చూసుకుంటూవుండలేవుటమ్మా? పొద్దుయ్యిమీద ఎసరశేసాలే ఇంతలోకే ప్రాణాలుఃపోవు. ఈవల గొల్లెమేసి పోతున్నానమ్మో [అని వీధితలు పీవల గొల్లెమేసి] దిక్కుమాలిన సంతగాని నదువమ్మా నహవు. వెళ్ళేదాన్ని నిన్నుకూడా ఆపా. [అని సావిత్రితో గలిసి

నడచు]

సావిత్రి:—అత్తా! ఏమిటమ్మా! ఎప్పుడూ గందరగోళమే. బయట పడేశావు. పయట సరిగా సర్దుకో. చెఱువుకు వెళ్లి మంచినీళ్ళు తెచ్చుకోవడాని కింతహడావిడా?

పుల్లమ్మ:—నేనాడావిణ్ణి కాబట్టి నాకు హడావిడీ, బయట పడ్డమున్నూ! మీరంత్తా మగావిళ్ళు. మీకేహడావిడ్లూ వుండవు? [అని పయట సర్దుకొనును.]

సావిత్రి:—అప్పుడే ఏమిటో అన్నానే?

పుల్లమ్మ:—కాదోమఱి. ఈవేళ పత్యంతినవచ్చునని వైద్యుడన్నాడు. అన్నాడో లేదో ఏమంటే ఏంవిందో వల్ల మందుముండ.

సావిత్రి:—మీ అత్తగారేనా?

పుల్లమ్మ:—అత్తగారే! దాని మొహాన్ని నిప్పులొయ్య. మొగం కడుక్కోకుండానే పొట్లకాయ పోపునేస్తూ! బీరకాయ పచ్చడిచేస్తూ! కారప్పొడి చేశావా? కఱివేపాకోకావా? ఎసరడెయ్యి, పెసరట్టు చెయ్యి, అని నాఏముకులు కట్టబోను కనుక ఎలకలు కొఱికేస్తాయి అలా ఒకమూల కొఱికెయ్యడం, ఒకమూల

కూసుకుంక చిట్టుబుట్టుమంటూ చెంపుకు పెనకా
లే వస్తానని చెంగట్టుకు తిగలాగడం. చస్తున్నా ఏం
పనుకున్నావో!

సావిత్రి:—మీఆయన కాసంత సేపు చంటిపిల్లను కనిపెట్టి
తియ్యరటమ్మా!

పుల్లమ్మ:—మాయింటాయనా? ఆయనంతా అదోమా-
యా: టింగురంగామని వెంపుకలు నెలసిపోతున్నా
గాని 'కాపింగు' దువ్వి ఉప్పిడిపిండో మినపకుడుంపో
డబ్బులపాటివాడి కొట్లో కొట్టిడబ్బెట్టి అప్పుడే ఎక్క-
డో చీట్లాడుతూవుంటారు. నేకావరాని కొచ్చినప్ప-
ట్నించి అదేమచ్చు. రెండు జాములకు అదేజావు బ-
డేజావు.

సావిత్రి:—అబ్బాయి రాముడు?

పుల్లమ్మ:—వాడో దేశదిమ్మరి. వాడి అజాపజా ఎవరికై-
నా కావాలా? వాడిజోలా కొంతా! పిల్లని తియ్యడాని
కన్నా వుండకుండా తరవాణికుండా వణ్ణము తిని తి
పాదిలాగు అస్తమానం ఊరట్టుకు తిరుగుతాడు. మ
ళ్ళీ అంతా నన్ను సుఖపెట్టేవారే. చెబుతే నమ్మ
తావో లేదోకాని నీపేరింటి సావిత్రిసాక్షిగా యమ

లోక మనుభవిస్తున్నా, ఆపిశాచపు కాణాది ఆచా
రానికి నేను చద్దివణ్ణం తిని వంటచేస్తే పనికిరాదు. ఈ
పొద్దు నిజంగా చస్తున్నా. అందులోకీ చూడు ఇల్లా
లా! చూడు. నాలుగు రోజులునుంచి రెండుపూట్లా
పొయ్యి రాక ననుకుంటాను. కన్నొటికే పోల్లు. ఎఱ్ఱ
గా ఎఱుపులు. తెల్లాజేసరికి అంటుకుపోయి నల్లతె
ప్పలు ఎంతకూవిడవు? [అని కళ్ళు జూపును]

సావిత్రి:—దానికేమీ లేదు. జోడెట్టుకుంటే కుదురుతుంది.

పుల్లమ్మ:—చెప్పులుజోడే?

సావిత్రి:—చెప్పులుజోడైతే కళ్లకెందుకు చెబుతాను?

పుల్లమ్మ:—ఈదవఢా ఆదవడా చెబుదువు. కంతకుదగ్గ బొం
తవి. మాటలు నేరుస్తున్నావు నవ్వాను. చెప్పులు
జోడుకాకపోతే యింకేం జోడుంది. ఈడ్జోడ్జో
వియ్యపురాలా అన్నారు. వియ్యపురాల్జోడా?

సావిత్రి:—ఆజోడైతే చెప్పులుజోడుకంటేకూడా బాగాప
నిచేస్తుంది.

పుల్లమ్మ:—ఆడపిల్లలను కంటున్నావు లేగాని చెప్పవో!

సావిత్రి:—కళ్ళజోడు. ముక్కుమీద నిలుస్తుంది. రెండు
కళ్ళను ధగధగ లాడిపోతూఉంటుంది. చెప్పులకంటూ

సింగారిస్తుంది. అదివుంటే నీకు వేతే ముక్కుపుడ కక్కఱలేదు. చెవల్ని జుంకా లక్కఱలేదు. చూ ద్దుగాని మాఆడబిడ్డ ఈలావస్తుం దిప్పుడు. ఆవిడ కళ్ళనంటాయి. అదిగో! [అని దూరమునఁ జూపును]

పుల్లమ్మ:—ఏమిటి? ఆవిడూరికే వెఱ్ఱిత్తినదాని లాగాలా ప ఱుగెడుతూంది. శాస్త్రిలా కేకెయ్యవో? కాలికి చ డాపులున్నట్టున్నా యేంవిటి? అదేంవిటమ్మా! గొడు గుకూడా విప్పుతూంది. చెఱువు కేనా ఏంవిటి ఆరా వడము.

సావిత్రి:—చెఱువు కే.

పుల్లమ్మ:—అప్పైతే బింద్దైనా చెంబైనా అక్కఱలే.

సావిత్రి:—ఆవిడూటికే చెఱువు చూడ్డానికి వస్తూంది.

పుల్లమ్మ:—దిబ్బాదిరుగుండం చూడ్డాని కేంకాదు? ఆలాఅం టే నీఆడబిడ్డ నన్నానని అప్పుడే నీకు అలక కాం బోలు.

సావిత్రి:—నా కేంఅలకమ్మా తుంటికొడితే పళ్లురాలాయని

పుల్లమ్మ:—నీకు అలక లేకపోతే ఏదీ ఒకమాటు పకపకా నవ్వి ఆవిడగార్ని అక్కడుండవమ్మా అని ఒక్క మాటు కేకవెయ్యి. నీవు వెయ్యలేకపోతే నేనే వే

స్త్రీ. ఓవిడా! ఓవెళ్ళే ఆవిడా! వెఱ్ఱివేపకాయ. వెన
క్కి చూడనే చూడదు. ఆవిడ పేరెవరు సావిత్రీ!
సావిత్రి:—వరహా. ఈవీధికిరాక ఆమె అలా మళ్ళిపోయిం
ది. చుట్టుదారిని వస్తుందనుకుంటూ చెఱువుగట్టున
పుల్లమ్మ:—వడహా! [అని కేక వేయును] వడహా! ఆ పేరు నా
కు తిరగదో?
సావిత్రి:—తిరగడాని కెప్పుడైనా చదువుకుంటేనా? వరహా!
[అని కేక వేయుచుండును.]
పుల్లమ్మ:—వరహాఅంటే వరహారాలేదుకాని భావన జీలక
ఱ్ఱ వచ్చింది.
[భావమ్మ అను ఆమె బిందెతో ప్రవేశము]
భావమ్మ:—వరహాకాదు మొహరీ. ఏమిటి సావిత్రీ! నీ
క్కూడా బొత్తిగా మతిపోతూవున్నట్టుంది. వీధమ్మ
ట మగవాళ్లు నడుస్తుంటారన్న మాటైనాలేదు.
పుల్లమ్మ:—భావమ్మొదినా! దానిక్కూడాఅంటే నాకు లేద
న్నమాటా యేమిటి. నామూలంగా పిలిచిందిలే. ఇం
తలోకే మాయింటి ఆడపడుచుతనాని కేమీలోటు
రాదు.
భావమ్మ.—చాల్లే అన్నిటికీ నీవే పూసుకొని వస్తావు?

హాస్యం.

పుల్లమ్మ:—ఏం చేయ్యమంటావు. నాముఖారవిందము. గుండుసూదిలాగు నీవు పొడుచుకొని రావడం బాగుందేం?

భావమ్మ:— అదికాదో పుల్లమ్మొదినా? నిన్నన్నానా చెప్పుమంటి?

పుల్లమ్మ:—కూడా అంటే

భావమ్మ:—కూడా అంటే కూడా అన్నమాటే. అరుగో చూడు మనకూడా రాబోయ్యేవారంతా ఆరామమ్మ, ఆబొడ్డపాటివారి వెంకమ్మ, ఆరేణిగుంటవారి రుక్మిణమ్మ.

పుల్లమ్మ:— ఓహో!

ముగురాడువాండ్రు గూడిన
సుగుణాకర పట్టపగలె చుక్కలు పొడుచున్.

[అని అందఱును గుమిగూడి గుజగుజలు పోవుచుందురు]

సావిత్రి.—బాగుంది సొద. అదిగో చూడండి. సత్యవతి అప్పుడే ఒకబిందె యింట్లోపోసికొని రెండవ బిందెకు వెళుతూవున్నది. మనకిక్కడేనక్కలు కూస్తున్నాయి.

వెంకమ్మ:—దానికీ మనకీ సాటవటరా! దాన్నింతప్పట్నించి ఎఱుగుదును. పొద్దున్నే లేస్తుంది. పిల్లలను లే

పుతుంది. వాళ్ళూ తానూ కల్యకృత్యాలు దీర్చికొన్నాక పిల్లలకు తలలుదువ్వి నీళ్లుపోసి శుభ్రమైన దుస్తులు తొడుగుతుంది. తాను తలదువ్వుకొని నీళ్లు పోసికొని శుభ్రమైన పొడిబట్ట కట్టుకొని, చెరువుకు వెళ్ళి రెండుబిందెల మంచినీళ్లు రెండవకంటివారికి తెలియకుండా ఇట్టేవెళ్లి అట్టేతెచ్చుకుంటుంది. పెందలకడే వంటచేసి అత్తమామలకు బత్తితోబెట్టి భర్తా తానూ భుజించి, ఎంతోచక్కగా నేర్పుగా ఇల్లు దిద్దుకుంటుంది. తీఱికున్నప్పుడు మనకుమల్లే పెత్తనాలకుపోక పుస్తకంతో కాలక్షేపం చేస్తుంది. చదివి అర్థం చెబుతుంది. మొన్న మధ్యాహ్నం గాబోలు చూచాను. అత్తగారిని కూర్చోబెట్టి రామాయణం చదివి అర్థం చెబుతూవున్నది. వినడానికి గనడానికి ముచ్చటేసింది.

పుల్లమ్మ:...వినడానికి ముచ్చటేసినా వెయ్యకపోయినా కనడానికి ముచ్చటేసింది. నడవండి, అడుగెయ్యండి. సావిత్రమ్మా నేనూఅయితే ఈపాటికి నీళ్లుముంచుకుని ఇంటికివెళ్లి కూరపోపెడుతూ వుందుము.

రుక్మిణమ్మ:—ఏంకూర మ్మా! ఈవేళ మీాయింట్లో!

పుల్లమ్మ:—నిన్నగాక మొన్న కాపరాని కొచ్చావో లేదో మాయూరు, నీకూ నాతో సరాగమే! ఏంకూరా? రేనిగుంటకూర.

రామమ్మ:—పుల్లమ్మ మతీ పిల్లమ్మ అవుతోంది. మళ్లీ ఓమ న గుంటలాడేటట్టుంది.

పుల్లమ్మ:—నేనన్న దానికి పెడర్థము చేసికోకపోతే మన కం దఱికీ నవ్వుతూంటేపడే చెక్కిలిగుంట లనుకో కూడదూ? [అని అనుకుంటూ నిష్క్రమింతురు.]

---

దృశ్యము ౨ — కోనేటిగట్టు.

— ♦ —

కాపలాకాసేవాఁడు:—"ఎల్లఎల్ల కెళ్లినాఁను గోంగూర కే
మాయదారి అత్తగారు గోంగూర కే"
[అని పాట మొదలుపెట్టి అంతలో చెఱువులోనికి దున్నపోతు దిగడం చూచుట అభినయించి] "ఎహెం య్! ఎహెంయ్!" [అని, పోతు పైకెక్కి పోవడముచే శాంతించి తనకు దెలియకుండ వచ్చిదిగిన ఆడువాం డ్రి నుద్దేశించి] ఈయూాచు కోనేరుకు కాపలాకాసే కన్న ఏకాపుల కంపతంలోనైనా పాలేరుతనం చేసు

ఉంటూ గొడ్లను గాసుకోవడం మెఱుగు.—బట్టలు ఉతక్కండి—కామమ్మగారూ! పుల్లమ్మామ్మగారూ! అంటే, పుల్లమ్మగార్కి ఉస్సు—ఉస్సు! ఇస్సు! అదిగో? మేటిడు. బిందెతో మకండి అవ్వగారూ! భావమ్మవ్వగారూ! అంటే, భావమ్మగారికి బారెడు. గండిగ్రసు కెట్టి యెండగ్రికాయ రాసినట్టదే రాయడం. అదిగో కాగుబిందె.—స్నానంచేయకండి, తల్లిగారూ! సావిత్రిమ్మతల్లిగారూ! అంటే సావిత్రిమ్మగారికి తగని తామసం—నూనెరాచుకున్నతలతో అదిగో! బుళుకుబుళుకు మునగ లేవ మునగ లేవ—బందచెయ్యకండి అప్పగారూ! వెంకమ్మప్పగారూ! అంటే వెంకమ్మగారికి అరికాలమంట. కసపిస—అదిగో పేడతొక్కొచ్చిన కాళ్ళతో—గట్టాడ గొట్టకండి—అక్కగారూ! రామక్కగారూ! అంటే రామమ్మగారికి రవరవలు రుసరుసలు—అదిగో కాస్త పచ్చుమట్టిఅంటూ బెల్లుకుబెల్లే—పావంచాలమీాద ఇండుగతీయకండి అమ్మగారూ! రుక్మిణమ్మగారూ! అంటే రుక్మిణమ్మగార్కి కారాలు మిరియాలు. అదిగో! నొక్కినొక్కి ఒకతే అరగతీత— ఆ! ఆ! ఆ! [అని వేటుద్దేశించి] గ

ప్పచిప్పగా! మరిడిగా! ఒరేవు మరిడిగా! గొడ్లను ది గేస్తున్నావు. ఎహేయ్! ఎహేయ్! మల్లేయ్! మల్లె య్!—[సత్యవతి వచ్చుట జూచి] మీారా! సత్య వతమ్మగారూ! అమ్మో! వెళ్లండి! వెళ్ళండి! దణ్ణాలు. ఆనక మీాయింటికొస్తా! కొంచెం వెచ్చనన్నంలోకి పచ్చడుంటే పెట్టించండేం—ఎహేయ్! ఎహేయ్!మ ల్లెయి! మల్లెయి! [నరహో వచ్చుట చూచి] వహ్వా! వహ్వా!—[తిరిగి మఱియొకవైపు మఱలి] ఎహేయ్ ఎహేయ్! నన్ను లెగ్గొట్టక మానవు. ఈదిక్కుమా లిన గొడ్లని పూర్వకాలంలో కిటమ్మెల్లా కాసేవా డో—[తనలో కూనరాగం తీసికుంటూ]

"వాకరి వాకరి కొప్పులోను
గుప్పిడేసి మల్లెమొగ్గలు
సత్తెబాంవ కొప్పులోను సన్నజాజులు."

ఒరేయి! ఒరేయి! ఓరి! గేదెనల్లా ఒగ్గెయ్యడమే? ఒ గ్గెయ్యడమే? [అంటూ నిష్క్రమించును.]

---

## దృశ్యము 3 ... నీరాటరేవు.

... ♦ సత్యవతి దిగి నీళ్లుముంచుచు ♦ ...

పా ట.



ఆహా! యీకాసారము
మోహన జలపూరము.

i అందమైన తామర పూ
లిఁదువిచ్చు మానుగా
మందముగను పైరుగాలి
యూఁచుకొనెను హాయిగా [ఆహా]

ii ఇందుధరుని శిరముగంగ
కెంపు సమము సారము
చిందు చిన్ని కెరటాలను
గంపగుఁ గడఁదీరము. [ఆహా!]

[అని నీళ్లబిందెతో వెలికి వచ్చును.]

[నిష్క్రమించును.]



దృశ్యము ౪ — [దూరంగా రావిచెట్టు, గౌరిదేవి గాతివి గ్రామము, దగ్గఱగా తుమ్మిపూలు పూచినచిన్ని మొలకలు. సత్యవతి నీళ్లబిందె రావిచెట్టు చుట్టునున్న తిన్నెపైనిబెట్టి తుమ్మిపువ్వులు కోయుచుండును. "వరహా" అను నామె అటు వచ్చుచుండును.]



వరహా:—ఏమిటమ్మా! సత్యవతమ్మా! నీవు ఈవూళ్లో ఉన్నావు?

సత్యవతి:—వరహాలూ! ఎప్పుడొచ్చావు. ఏదో మాటమీద మాటొచ్చి మీవదిన సావిత్రి నీవీమధ్య వొస్తావంది. ఫలానప్పుడనిమాత్రం చెప్పలేదు. నీవంట్లో బాగా ఆరోగ్యముగా నున్నదా? మావారి కీవూరు బదలాయింపయింది. ఇక్కడ ఉంటున్నాం. ఎప్పుడో బడిలో చిన్నప్పుడు చదువుకున్నప్పుడు చూచా! మళ్లీ ఇన్నాళ్లకు నీసందర్శన మబ్బింది. నేడెంతో సుదినం. ఇంకా నాలుగు రోజులుంటావా? ఈలాగెక్కడినుంచి రాక?

వరహా:—ఉంటా! కలుసుకుంటా! కాస్సేపాలా "షికారు"

వెళ్లి సృష్టివైచిత్ర్యములను గనిపెట్టి, మంచిగాలిని పీల్చి వస్తున్నా—ఏమిటమ్మా! కోస్తున్నావు?

సత్యవతి:—ఇవా? ఇవి పార్వతీపరమేశ్వరులకుఁ బ్రీతికరములై, ధవళనిర్మలినములై, వినయవిధేయతలకు దాహరణములా అన్నట్టు ఆకులచాటున నణగి మణగియుండు తుమ్మిపువ్వులు.

వరహా:—నీజడలోవి?

సత్యవతి:—అవా? అవి యిచ్చకోలంది పేదయిల్లాండ్రు సయితము గోసికొని కొప్పులందున ముడుచుకొను పచ్చగన్నేరుపువ్వులు కొన్ని, వేకువనే లోకబాంధవుని విలోకించుచు నతిసుందరంబుగ వికసించి సువాసన రహించు నెర్రితామర పూరేకులు కొన్ని.

వరహా:—అవంటే తల్లో పెట్టుకున్నావు? అడుగులడుగున నలుగుడువడు నలుసుల్లాంటివి వేమి చేయుదువు?

సత్యవతి:—వీనితో గౌరిదేవిని పూజింతు.

వరహా:—గౌరి అన?

సత్యవతి:—పూర్వకాల మెప్పుడో అక్కడ ఆరావికిర్సించ వెలిసిన వేల్పంటారు. కాని గౌరిఅన నాఅభిప్రాయము జగత్తంతకు ఆధారభూతమైన శక్తి. ఆశక్తి

లేనిదే మన మేపనీ జేయనేరము.

వరహా:—జగత్తులంతా శక్తిమయమగు నెడల ఈశ్వరభావమేమి?

సత్యవతి:—ఈశ్వరుఁడన మనలో నిమిడియున్న శక్తిని మన కిహపరసాధనముగఁ బరివర్తింపఁజేయు నొక యింగితవ్యక్తి. రెండింటికిని భేదమేమియు లేదు. కావుననే భార్యాభర్త లొకరెక్కువ యొకరు తక్కువ యని యనుకొనకుండ నన్యోన్యము ప్రేమించుకొనుచు నన్యోన్యము గౌరవించుకొనుచు తమతమ విద్యుక్తధర్మములను నెఱవేర్చుకొనుచుండవలెను.

వరహా:—ఇంతమాత్రము మనము మనస్సులో నుంచుకొనిన చాలదా? బాహ్యాడంబరముగ పువ్వులతో దివ్వెలతో పసుపుకుంకుమములతో తోరాలతో ధారాలతోఁ బూజసేయవలెనా?

సత్యవతి:—ఆహా! భగవదారాధనమందు, పూజనిమిత్తము పువ్వులుగోసినా, గంధముతీసినా, వత్తులు జేసినా, మన మనస్సు మంచి నలవఱచుకొనుచు, సృష్టియందు గౌరవభావము నినుమడించుకొనును. ఎందుకు? నేను మాయింటియొద్ద ఒక చిన్న పూలతోట వేసి

తిని. అందేనిత్తైను మల్లి, నిత్తైమల్లి, బంతి, చామంతి, మందారము, మంకెన్న, జాజి, విరజాజి, నీరగోరింట, నీలాంబరము ఏదో ఒకటి విరివిగఁ బూయుచు ఆపరమాత్మయొక్క అపారమైన ప్రేమను ప్రకటించుచుండును. ఆపూలపైఁబడు మంచునీటిబిందువుల ముందు పన్నీరెందు కనిపించును. రెమ్మలపైనుండి వీతెంచు విమలవాయుపోతములముందు విసనకఱ్ఱలు మూలబడును. రేకులపై రంగులముందు కల్లబొల్లి సింగారాలు సిగ్గుగొను. ఇఁక బాహ్యడంబరమున కెడమేది?

వరహా:— నీవాగ్ధోరణి వర్ణనాతీతమగుఁగాని దేవుఁడన ఆరాయి యొక్కటే?

సత్యవతి:— అట్లైవరనిరి? దేవుఁ డంతటను నిండియున్నాడు. చిన్న గులకరాయియందును, పెద్దబ్రహ్మాండమందును ఒక్కరీతిని విలసిల్లుచున్నాడు. రాతిని బూజించు కేలనన: ఆసమార్చనమందు మనకు నిదానము నమ్మకము భక్తి కుదురును. నీవు గనుక ఒక్కసారి కాసంత రాతియందు, కదలా మెదలనిరాతియందు, కఠినమైన రాతియందు, భగవంతుఁడు

న్నాడను నమ్మకము చిక్కుబట్టైనా — ఆరాత్రిపై నె
ల్లాడుచు చల్లనిగాలి వీచు రావిచెట్టునందు, వేప
చెట్టునందు, ఆచెట్లపై వానగురియుచు సంచరించు
మేఘములందు, ఆమేఘముల చాటునుండి వెలుతు
రిచ్చు సూర్యచంద్రనక్షత్రాదులయందు ఆసూర్య
చంద్రులకు చోటిచ్చు ఆకాశమందు ఆఆకసముక్రిం
ద మనోహరంబుగనుండు పచ్చని పంటభూమియందు
అంతటను భగవంతుడున్నాడను నమ్మకము సహజ
ముగ తనంతనే ప్రబలు. కేవలము రాతియందే దే
వుడున్నాడని పూజించువారు మూర్ఖులు. రాతియం
దు దేవుడు లేడనుకొనువారంతకన్న మూర్ఖులు. భ
గవంతుని మనస్సులో నమ్మినవారికి చరాచరజంతు
కోటి సమస్తమందును రాళ్లయందును నీళ్ళయందును
అంతటను కనిపించు. ప్రహ్లాదునకు నృసింహమూర్తి
స్తంభమందు ప్రత్యక్షమయ్యెనని మనము చదువమే?
కావలసినది భక్తి. భక్తిలేనిపూజ పత్రిచేటు.

వరహా:—సరే. రాయిఅంటే సృష్టిలోనిది. రావిచెట్టంటేసృ
ష్టివేసింది. వాటిని పూజింపవచ్చుననుకుందుము. కాని
బంగారు ప్రతిమలకు, ఇత్తడిబొమ్మలకు, గోడల వెల్ల

కు బొమ్మలెట్టి పూజిస్తారే వాటి నేమందువు?

సత్యవతి:—తల్లి కానా! అవి పురాణములలో చెప్పబడ్డ మహాపతివ్రతలను గురించి పుట్టబడ్డవి. అవే మనకు ముక్తి నిచ్చునవి. భగవద్భక్తితత్పరులమై మనకేమి యున్నక్కఱలేదని మనముండవలెనన్ననుండవచ్చును. కాని పురాకృత ప్రకృతసంబంధమైన సంసారబంధమందెవ్వ డు మనము పట్టుపడుచున్నామో అప్పుడు మనకు కష్ట నిష్ఠురములు తప్పవు. అట్టిక్లిష్ట సమయములందు మనమెట్లు నీతిపరులమై యుండవలెనో, మన పాతివ్రత్యము నెట్లు మనము కాపాడుకొనవలెనో ఎట్లతిథుల సత్కరింపవలయునో, అత్తమామల నెట్లుభక్తితో బూజింపవలయునో, ఎట్లు దుష్టుల బారినుండి తొలగించవలయునో, ఎట్లనుదినమును శుచిశుభ్రత కలిగి సంతోషముతో నొప్పవలయునో, ఎట్లు ఇల్లుదిద్ది తీర్చుకొనవలయునో, నేర్పు ఓర్పు ఎట్లుండవలెనో మున్నగు సమస్త సద్విషయములూ ఆవ్రతములకు మూలములైన మహాయిల్లాండ్రకథలను జెప్పుకొనుటలో మన మనస్సుల పట్టియుండి కష్టకాలమున మనల గట్టెక్కించు. గుడ్డెద్దు చేనబడ్డట్టుకాకుండ అర్థము చే

సికొని సదాచారసంపత్తిని చేసినచో మనకవి యెం
తయో మేలుసేయును.

వరహా:—మఱి నీవు ఏమివ్రతములు పట్టినావమ్మా!

సత్యవతి:...అన్నిని. ఈవేళ నాకు శుక్రవారము.

వరహా:-నీకు ఈవేళ శుక్రవారముకదా, ఎంతో ఆచారవం
తురాలనంటున్నావుకదా. చెర్లో నీళ్లుపోసుకోకుండా
తడిబట్ట కట్టుకోకుండా, బిందె తోముకోకుండా మం
చినీళ్లింటికి తేవచ్చునా?

సత్యవతి:...నన్నన్నందుకు కాదుగాని వరహాలు గబుక్కున
ఎవర్నీ ఆలా అనరాదు. మన మెప్పుడూ మంచినీ
ళ్లు త్రాగేచెర్లో స్నానము చేయరాదు. అందులో
బట్టలుతకకూడదు. బిందెలు తోమతగదు. అంతి
యకాక తడిబట్ట కట్టుకొని అది ఒంటినంటిపెట్టుకు
నీళ్లోడుతూవుంటే వీథమ్మట ఆడుది నడచుటెన్నడును
మంచిదికాదు. మనయొక్కయు మన సంఘముయొ
క్కయు ఆరోగ్యమును కట్టుబాటును మనము కాపాడ
వలయును. అందుచే నేనుదయముననే ఇంటియొద్దనూ
తికడనే బిందె తెల్లగ తోముకొని, అక్కడే రాతి
పైని బట్టలుతుక్కొని, నీళ్లుపోసికొని మడిచీర కట్టు

కొని, మంచినీళ్లు తెచ్చుకొందును. నీళ్లుపట్టుకొని వచ్చుటలో వీధిలోని ధూళీ దుమ్ము, ఆకులలము ప డకుండునట్లుగను నీళ్లుముంచుటలో వడపోత కనువు గ నుండునట్లును, తెల్లని యంగవస్త్రమొకటి ఆపరి శుభ్రమగు బిందెపై కప్పియుంతును.

వరహా:—బిందె నీవే తోముకొని, బట్టలూ నీవేఉతుకొ ని నీళ్లూ నీవే తెస్తావా? సత్యవతీ! ఇన్నిపనులు చేసి కొన్న వెనుక ఇంకా నీకు షికారు వెళ్లే "ప్లెజరు," వార్తాపత్రికలలోని సంగతులు తెలిసికొనే "లీజరు" ఉండదనుకొంటూ.

సత్యవతి:...ఉండదనుకుంటే ఉండదు. చైత్రమాసములో మాకుటుంబమంతా భద్రాచలయాత్ర చేసినాము. అప్పుడు పట్టిసము పాపికొండలు పర్ణశాల కన్నులపం డువుగ చూచి వచ్చినాము. నాకావిహారములకు బోయి అల్పాహారములు భుజించునప్పటికన్న యె క్కుడు వింతగ యెక్కుడు సంతోషముగ దారిలో ఇసుకతిప్పలమీద వండుకొని తిన్నాను. వైశాఖ మాసములో విశాఖపట్టణము మా అన్నగారి పెద్ద మ్మాయి పెళ్లికివెళ్లి సింహాచలము చూచివచ్చినాను

ఆమాధవధార ఆకాశధార వర్ణనాతీతములు. జ్యేష్ఠాషాఢ మాసములలో మామిడితోటలో కాపురమున్నాము. అప్పుడుకూసిన కోయిల ఇప్పటికిని నా చెవిలో కూస్తూవున్నట్లుండును. శ్రావణమాసములో ఇంటింటికి శనగలకు వెడతాను. స్నేహితురాండ్రిందఱిని పలుకరిస్తాను. భాద్రపదమాసమందు వినాయక చవితికి పురాణం వింటాను. ఆశ్వయుజమాసములో అట్లతద్దికి దసరాపండక్కి అందఱమూ కలసి ఆటపాటల నానందంగా గడుపుతూవుంటాము. ఇట్లే ఎప్పటికప్పుడు మనకు విజ్ఞానమును, వినోదమును, గల్గించు పండుగులు, పర్వదినములు, తీర్థములు సార్థములు మన పూర్వు లేర్పాటుచేసియే యున్నారు. వానికొఱకని చెప్పి పనికట్టుకొని రోజూ 4 గంటలకో చావడిలో సమావేశం కానక్కఱలేదు. వార్తలంటావు. ఒకపత్రిక చదువుకొని అందులోని అంశములు గ్రహించి అందలి మంచిననుకరిస్తే పదివేలు. చూడు. వరహాలమ్మా! అన్నీ మనం చేసికోవడములో వున్నది. ఈవేళ భర్తకాస్నంత భోజనమునకు రావడము ఆలస్యమైనా విసుక్కుంటూ కసు

క్కంటూ ఆపిల్లనుకొట్టి ఈపిల్లనుతిట్టి చెంబుతన్నేసి గిన్నె బోర్లదోసి ఉన్నపని రెండింతలయ్యేటట్టు కాళ్లాచేతులా తొక్కుక్కళ్లా డేకంటె ఆరవంతసేపూ వాల్మీక రామాయణాం చేతబుచ్చుకొని నిశ్చలబుద్ధితో పఠిస్తూంటే శ్రేయస్సు. అస్లే మఱొకప్పుడు చిట్టిచిట్టికథలు, ఇతిహాసాలు, చెప్పవచ్చును. కాలము మనము వృథాపుచ్చరాదు.

వరహా:...అవునో! అంతా మనం చేసికోవడంలోవుంది. అనుకోవడంలోను అట్టహాసంగా ఉపన్యాసాలివ్వడంలోనూ లేదు. సత్యవతమ్మా! నిన్ను జూచినకొలదీ నాకుకూడా ఈగొడుగూ ఈజోడూ ఈసులోచనాలు తీసివేసి బిందెత్తుకొని చెఱువునుండి మంచినీళ్లింటికిఁ గొంపోవాలని కోరిక పుట్టుచున్నది.

సత్యవతి:...నీమాటకు నాకుచాలా సంతోషము వేస్తాంది. మన మర్యాద కాపాడుటకు మన ఆరోగ్యము నిలుచుటకు మనకట్టూ మనబొట్టే అవలంబింపఁ దగ్గవి. ఆముక్క నేను మొట్టమొదటనే అనాలనుకున్నాను గాని అవి నీకెట్టి సదుపాయమిచ్చుచున్నవో అని ఊరకున్నా. మఱియు నింటి సంబంధమగు బట్టలుత

కడము, నీళ్లుతోడడము, పాదులు పెంచడము, పూలుకోయడము మొదలగు ఐచ్ఛికసేవ మనకు వ్యాయామము. బిడ్డలయొక్క చదువుసంధ్యలు కనిపెట్టి చూడడము, వారిపరిశుభ్రతసౌశీల్యమునిలబెట్టడము మనముచేయుదేశసేవ. యేమన మనయిప్పటిచిన్నిబిడ్డలేముందుముందు పెద్దవారలై మనదేశ ముద్ధరించువారు. ఇరుగుపొరుగువారు నొవ్వకుండ, ఊరిలోవారు మనపై రాలురువ్వకుండ జాగ్రత్తతో మెలంగుటయే మన సంఘజీవనము.

వరహా:—తల్లీ! ఇవన్నీ తోడివారికి బోధసేసి వారినికూడ నీతోత్రోవకు దిప్పికొందుము.

సత్యవతి:— ఎప్పుడును జెప్పుటకన్న జేయుటమేలు. అమ్మా వరహాలూ! నిన్న చాలసేపనవరసరముగ నాపితి. మన్నింపవలయు.

వరహా:-నీవు నన్నాపలేదు. నేనే నిన్నాపితిని. నన్ను మన్నించి నీతోఁగూడ నేడు గౌరిపూజసేయుటలో జతగాగొందుము. నీవంటియుత్తమురాలు ముల్లోకములకలంకారము: ఇప్పుడే యింటికిఁ జని బిందెతో వచ్చెదాన. [అని నిష్క్రమించును.]

సత్యవతి:—శుభస్యశీఘ్రము. అవశ్యము రమ్ము. నేనిందే యుందు. అయ్యో! వరహాని చూచి ఆమెవల్ల సమస్తము వినికాంబోలు, ఆమెతోఁగూడ తక్కుంగల నాసోదరీమణులెల్ల ఇటు వచ్చుచున్నారు. నేనును గౌరిని జూసియుందు. [నిష్క్రమించును.]

---

దృశ్యము ౫ — గౌరిపూజ — పాట — ప్రదక్షిణము.

అందఱు:— భానోదయమునకు ముందె
ప్రక్కనుండి లేచెదన్ ॥
స్నానమింట జక్కఁజేసి
నయముగ మడిఁగట్టెదన్ ॥
మానుగ నే మంచినీరు
మడుగునుండి తెచ్చెదన్ ॥
ఆనడుమను అంబ! నీకు
అర్చనమును జేసెదన్ ॥
తల్లి! కావు నన్నెప్పుడు
తల్లి! దయన్ గనుమినన్ ॥
ఉల్లమలర నీదుచుట్టు
చల్లనీడ మ్రొక్కెదన్. ॥

సత్యవతి:— అత్తమామలకును సేవ
అంధులైన జేసెనే
అల్ల సాధు సావిత్రిని
అనుసరింతు నెప్పుడున్ ॥

పుల్లమ్మ:— ప్రియుని వెంటనంటి విడని
ప్రేమ నడవి స్రుక్కెనే
అఖిలపుణ్యరాశి సీత
నాత్మలోన నిలిపెదన్ ॥

సావిత్రి:— అతిథనుండి బంటువలకు
అందఱు దినువెనుకఁ దా
ధర్మబుద్ధిఁ దగ భుజించు
ద్రౌపది నెదఁ గొలిపెదన్ ॥

వరహా:— కలహాకంఠి కడలదాసి
కొలువుసేయు చుండియున్
సత్యశౌచ శాంతినున్న
చంద్రమతి నుతించెదన్ ॥

## దృశ్యము ౫.

వెంకమ్మ:— శివ కేశవ స్వయంభవులు
చిన్నబిడ్డ లైనగన్
అడ్డాలను ఆడించిన
అనసూయన్ వేడెదన్ ॥

రామమ్మ:...భర్తతోడ పరమవేద
భావములను పాడు నా
మంచి తెలివిమంతురాలి
మైత్రేయిని మెచ్చెదన్ ॥

భావమ్మ:...కష్టనిష్ఠురముల కోర్చి
కలినిబాపి నలుధవున్
ధన్యత గనుగొన్న సాధ్వి
దమయంతిన్ దలచెదన్ ॥

రుక్మిణమ్మ:—గరువమింత యెఱుగనట్టి
గతిమిన్న రుక్మిణీ
రమణిబోలె భక్తితోడ
ప్రాణవిభుని గొలిచెదన్ ॥

[నిష్క్రమింతురు.]

అమ్మలారక్కలా రయిపోయె నాట
మీయిండ్లకడ మీరు మేల్సుఖపడుదు
మాయిండ్లకును మేము మంచిగబోదు
మయిన మిమ్ముల మేము నరయు మము మీరు
ఎప్పుడు మఱువక యెంచుకోవలయు
మిమ్ముల మమ్ముల మేదిని నేడు
గూర్చిన దైవాన్ని కొనియాడవలయు.



హారతి! జయహారతి! శుభహారతి!
భారతీ! పార్వతీ! రమావతీ!
హారతి! జయహారతి! శుభహారతి!



## ఏతత్కృతివిరచితము లింతవఱకు నచ్చుపడ్డవి.



| | | | |
|---|---|---|---|
| (1) | భావమురళి | రు 0-4-0 | |
| (2) | జనపదములు | 0-4-0 | |
| (3) | కుమారకంఠము | 0-4-0 | రు 1—0—0 |
| (4) | మాతృదేశ సంకీర్తనము | 0-4-0 | |
| (5) | కలరుతము | 0-4-0 | |
| (6) | ప్రకృతిచందనము | 0-4-0 | |
| (7) | ఆత్మవ్యక్తి | 0-8-0 | |
| (8) | సెలబాలుడు | | రు 1—[illegible]—0 |
| (9) | వేణువు | 0-12-0 (9 and 10 together) | |
| (10) | శేషఫణితి. | | |
| (11) | వివిధకుసుమావళి (రెండవకూర్పు) | 0-12-0 | |
| (12) | ఆగడపలు | 0-12-0 | రు 1—0—0 |
| (13) | చదువులదుత్త | 0- 4-0 | |
| (14) | చిత్రికత | 0- 6-0 | రు 1—0—0 |
| (15) | పాత్రికత | 0- 8-0 | |
| (16, 17, 18) | త్రయి | 0-14-0 | |
| (19) | కోనేరు | 0- 4-0 | రు 1—0—0 |

— ♦ కొండకొలను —— వికసితోత్పల ♦ —

## ప్రత్యేక సౌకర్యము.



వెనుకటి పుటనుగల పొత్తములన్నియు నొకేపరి అయిదు రూపాయలకు దీసికొనువారు శాశ్వతపాఠకులుగ బరిగణింపఁ బడుదురు.

వివరములు వలసినను

పొత్తములు వలసినను

కవి కొండల వేంకటరావుగారు,

నరసాపురము,

పశ్చిమ గోదావరి,

అని వ్రాయనగు.

## విశేష గమనిక.



పొత్తము (11) వివిధకుసుమావళి:— పాఠశాలల పఠనీయ గ్రంథముగ నంగీకరించబడినది.

పొత్తములు 1, 3, 6, 7, 8, 9, 10:—పుస్తకభాండాగారముల నిమిత్తమై యంగీకరింపబడినవి.

# కోనేరు.



కొండకోలకు ———— విక్రమోత్పల ———— శీర్షిక.

౧౪.

కవి

కవికొండల వేంకటరావు, బి. ఎ., బి. ఎల్.,

* *

*

అభినవాంధ్ర కార్యస్థాన సుప్రకాశితము.

మొదటి కూర్పు.

1930.

వెల రు 0—4—0.

సర్వస్వామ్యములు కవివి.



సీతారామా ముద్రాక్షరశాల, ముద్రితము.
నరసాపురము.

# ఇదొక చిన్న ప్రహసనము:



| రచన. | స్ఫురణ. |
| --- | --- |
| 10—11—1923. | నరసాపురము. |

## ఇందువచ్చు పాత్రలు.



పుల్లమ్మ
సావిత్రి
భావమ్మ
వెంకమ్మ
రామమ్మ
రుక్మిణమ్మ
వరహా.
సత్యవతి. } కులకాంతలు.

— కోనేరు కాపలా కాసేవాడు — గోపకుడు. —

## ఇందలి దృశ్యములు.



౧. పల్లెటూరి వీథి.
౨. కోనేటిగట్టు.
౩. నీరాటరేవు.
౪, దూరంగా రావిచెట్టు, గౌరిదేవి రాతివిగ్రహము, దగ్గఱగా తుమ్మిపూలుపూచిన చిన్న మొలకలు.
౫. గౌరిదేవి.

